శ్రీ

# అభినవసరస్వతి

యనునొక మాసపత్రిక

అష్టావధాని. జానపాటి పట్టాభిరామశాస్త్రిచేఁ

బ్రచురింపఁబడుచున్నది.

గుంటూరుజిల్లా, పల్నాడుతాలూకా, జానపాడు.

సంపుటము 6 { 1914 జూను } సంచిక 6

విషయములు.



చందానిర్ణయము సంవత్సరమునకు

ప్రధానపోషకులకు రు 25 0 0 సహాయులకు రు 5 0 0

పోషకులకు రు 10 0 0 చందాదారులకు 2 0 0

చంద్రికా ముద్రాక్షరశాల, గుంటూరు.

Printed at the Chandrika Press, Guntur
and Published at Janapadu, by the Editor Ashtavadhan
Janapati Pattabhirama Sastry.

అభినవసరస్వతీ కార్యస్థానమున వెలకు దొరకు పుస్తకములు—

| | | | | |
|---|---|---|---|---|
| 1 | అళ్ళయాచార్యవిజయము ... ... | రు. 0 | 4 | 0 |
| 2 | కరిణీకోద్ధారిణి ... ... | 0 | 4 | 0 |
| 3 | వాసంతికాపరిణయము } ఇవి నాటకములు. | 0 | 4 | 0 |
| 4 | కంసవధము } | 0 | 8 | 0 |
| 5 | చమత్కారమంజరి ... ... | 0 | 4 | 0 |
| 6 | విరూపాక్షపీఠగురుపరంపర ... ... | 0 | 2 | 0 |
| 7 | నీతిగీతలు (సునీతిశతకమునకు సంస్కృతము) | 0 | 2 | 0 |
| 8 | వత్సల నీతిశతకము ... ... | 0 | 1 | 6 |
| 9 | విశ్వబ్రాహ్మణశబ్దఖండనము ... ... | 0 | 2 | 0 |
| 10 | అత్యద్భుతవిమర్శనము ... ... | 0 | 5 | 0 |
| 11 | నర్సరావుపేట శతావధానము (తిరుపతి వేంకటీయము) | 0 | 3 | 0 |
| 12 | లక్ష్మీవిలాసము ... ... | 0 | 4 | 0 |
| 13 | చిత్తూరుజిల్లా తీర్పువిమర్శనము ... | 0 | 4 | 0 |
| 14 | పశ్యాంపుశ్యాం ... ... | 0 | 2 | 0 |
| 15 | సంగదోషము ... ... | 0 | 3 | 0 |
| 16 | పద్యశబ్దవిచారము ... ... | 0 | 3 | 0 |
| 17 | వీరభాగవతము ... ... | 1 | 4 | 0 |
| 18 | పుళిందావివాహము ... ... | 0 | 4 | 0 |
| 19 | గురిగింజ ... ... | 0 | 1 | 0 |
| 20 | గుంటూరుసీమ, తిరుపతి వేంకటీయము ... | 1 | 0 | 0 |
| 21 | వేమవరాగ్రహారశతావధానము ... | 0 | 12 | 0 |
| 22 | పిష్టపేషణము ... ... | 0 | 1 | 0 |
| 23 | వ్యాసనిష్కాసనము ... ... | 0 | 1 | 0 |

# అభినవసరస్వతి

సంపుట 6. | జానపాడు | ఆనంద సం॥ జ్యేష్ఠమాసం | సంచిక 6.

## సభాముఖమునందగ్రపూజ ఎవరికి జరుగవలెను?

ఈప్రశ్నమును గూర్చి పలువురు పలువిధముల వివాదపడుచున్నారు. కాని ఆస్తికులమగు మనకుఁ బ్రమాణభూతములగు శాస్త్రములలో నియ్యది చక్కఁగా వివరింపఁబడియేయున్నది, అన్నివిషయములలో మనల నిట్టిట్లు చేయుఁడని శ్రుతిస్మృతి పురాణాదులు శాసించుచుండగా మనలోమనము వెఱ్ఱిపట్టుదలలు పెట్టుకొని దెబ్బలాడుచుండుట నానావిధముల మనసాంఘిక పురోభివృద్ధికి ముప్పగు. ఈయగ్రపూజనుఁ గూర్చిమనుస్మృతి మనలనిటు శాసించెడిని.

శ్లో॥ విత్తం బంధు ర్వయః కర్మ విద్యాభవతి పంచమీ
ఏతానిమాన్యస్థానాని గరీయోయద్యదుత్తరమ్।

విద్యాధికులు సర్వథా ప్రథమపూజార్హులు.తరువాత కర్మజ్యేష్ఠులు,తదనంతరము వయోజ్యేష్ఠులు. పిమ్మటచుట్టములు. పదపడిధనికులు. ఈక్రమముగా సభ్యులగువారిలో నాధిక్యానాధిక్యములు నిర్ణయించి పూజలు(గౌరవార్థకములగు మన్ననలు మొదలగునవి) జరిగించుకొనుచుండవలెనని స్మృతికారులయభిప్రాయము.

ఐతే; ఈవిద్యయన నెయ్యది? ఇప్పుడు కొందఱు, ఇంగిలీషుఁజదివినవారును మఱి కొందఱు తురకము నెఱిఁగినవారును, ఒకకొందఱు సంస్కృతమభ్యసించినవారును వేఱొకళ్లు శాస్త్రముల నారితేరినవారును, ఇంక నొకకొంతమంది వేదము చెప్పుకొనినవారును, కలరు. ఇట్టివారిలో నెక్కువ తక్కువ లెట్లునిర్ణయింపనగును? అనుసంశయమొక టుత్పన్నమగుచున్నది. దీనికిఁగూడ సమాధానము ప్రాచీనసిద్ధాంతసరణిచే నిట్లు తేలుచున్నది. చదువులను—విద్యలనియు, కలలనియు, రెండుభాగములుగా విభజించిరి. మనుష్యున కైహికాముష్మిక శ్రేయస్సాధనమగు జ్ఞానమునుఁ గలుగజేయునవి విద్యలనియు, తాత్కాలికముగా, చమత్కారముఁగలిగించి లోకము నానందపెట్టు గాయకత్వకవిత్వాదులు కలలనియు, ప్రాచీనులసిద్ధాంతము. అందువిద్యలు:—

శ్లో॥ అంగాని వేదాశ్చత్వారః, మీమాంసా న్యాయవిస్తరః
పురాణం ధర్మశాస్త్రంచ, విద్యాహ్యేతా శ్చతుర్దశ॥

వేదములు వ్యాకరణము జ్యోతిషము కల్పసూత్రము ఛందస్సు నిరుక్తము శిక్ష(అను వేదాంగములు) పూర్వోత్తరమీమాంసాశాస్త్రములు న్యాయశాస్త్రము. పురాణములు. స్మృతులు. ఈవిద్యలలో సైతము

| | |
|---|---|
| గౌతమసూత్రము—ద్విజో వేదానసధీత్య యోన్యత్రకురుతేశ్రమం, ససాన్వయశ్శూద్రసమస్స్యాత్ | వేదముఁజెప్పుకొనక పెఱచదువులలోఁ గృషి జేయువిప్రుఁడు శూద్రునితో సమానుడు. |
| మనుస్మృతి—శ్లో॥ యోనధీత్యద్విజో వేదాన్ అన్యత్రకురుతేశ్రమం। సజీవన్నేవశూద్రత్వం। ఆశుగచ్ఛతి సాన్వయః॥ | అర్థమిదియే |
| మనుస్మృతి—శ్లో॥ వేదమేవసదాభ్యస్యేత్ తపస్తప్స్యన్ ద్విజోత్తమః। వేదాభ్యాసోహి విప్రస్యతపఃపరమిహోచ్యతే॥ | వేదముఁజెప్పుకొనుచుంటయే గొప్పతపస్సుగాన,తపస్సుజేయఁబూను కొనువాఁడు వేదమునభ్యసించుచుండవలెను. |
| మనుస్మృతి శ్లో॥ వేదవిద్యావ్రతస్నాతాన్ శ్రోత్రియాన్ గృహమేధినః।పూజయేత్ | ఏకశాఖమాత్రమైనను వేదాధ్యయనము జేసినవాఁడు పూజ్యుఁడు. |

అని ప్రమాణములనేకములుండుటంజేసి బ్రాహ్మణునకు వేదాధ్యయనమే ప్రధానతమమనియు నట్టివేదాధ్యేతయగువిప్రవర్యుఁడే యగ్రపూజ్యుఁడనియు నిర్ణయించుకోవలసియున్నది.

ఇదిగాక యింతయావశ్యకమని ప్రామాణికశిరోమణులగు శాస్త్రకర్తలచే నుద్ఘోషింపఁబడుచున్న వేదాధ్యయనమునకుఁ బూర్తిగాఁ బ్రచారము దేశములోఁగలుగజేయవలెననుతలంపుకల సనాతనధర్మపక్షపాతసముపేతులగుధీమంతులా వేదవిద్య నష్టకష్టములుపడిసాధించినట్టియుఁ దమహృదయములను పేటికలలోనిల్పి సృష్ట్యాదినుండియు వేదమంత్రములకు స్వరవర్ణాదిభేదము లీషన్మాత్రమైనఁగలుగకుండ నొకేవిధముగ నిల్పఁగలిగి నట్టియు సర్వథా మంత్రపరిపూతహృదయులగు వేదాధ్యేతల నెంతగాగౌరవింపవలసియుండునో గమనించుఁడు. కంఠము లెండిపోవునట్లు వర్ణించి వర్ణించి పడరాని పాట్లఁబడి వేదరాశినంతయు నాపోశనముఁబుచ్చుకొనియున్న పెద్దలు తమకన్నుల

రెయెదుట దరిద్రధ్వజములై యేవిధమైనగౌరవమును, పొందఁజాలక పిలుచువారును, తల చువారును లేక యత్యంతముగహీనతతోఁగనుపట్టుచున్నచో, పురోఽభివృద్ధి నన్వేషించు మనబాలు రెవరు, అట్టిశుష్కాధ్యయనమునకై గడంగుదురు? ప్రపంచమునఁ బుట్టినవాడెల్ల మనుముట్టుసమానస్కంధులలో గౌరవముననేకదా కోరుచుండును గాన సనాతనధర్మపక్షపాతులగు పెల్లరకును మంత్రమూలమగు బ్రాహ్మణ్యమునఁ గాపాడుచున్న వేదకుక్షులగు విప్రసత్తములే సభాదికస్థానములలోఁ బ్రథమపూజార్హులనుట నిర్వివాదాంశము.

దీనికొక పూర్వపక్షము— ధర్మప్రశ్నము; “తేషాంమంత్రాణాముపయోగే ద్వాదశాహముధశ్శయ్యా క్షారలవణవర్జనంచ”, “నమైథునంచరేత్” ఇత్యాదివిధులవలన వేదాధ్యయన మితరవిద్యాభ్యాసమువలెఁగాక యనేకనియమములతోఁగూడుకొనియుండవలె, అట్టినియమములులేక, ఊరకవల్లింపఁబడినమంత్రసంపత్తి ఫలదాయకముకాదు. ఇప్పటి వేదపాఠకు లట్టినియమములకు మనఃపూర్వకముగాఁ దిలాంజలులిచ్చుచున్నారు. ఇట్లు స్వైరాధ్యయనముగుటంజేసియే యాధునిక వేదాధ్యేతలయందు మంత్రమహిమలు గోచరమగుచుండుటలేదు. గాననీకాలమం దవధానులమని పేరుపెట్టికొని కుక్షింభరులైదిరుగుచుండువిప్రులను, పూజించినను, పూజించకపోయినను సమానమే. అనికొందఱు ప్రతిఘటించుచున్నారు.

సమాధానము—ఐతే, ఈవాద మంతయప్రామాణికమని మేమనము. కాని పూర్వోక్తనియమపూర్వకాధ్యేతలముందఱ నిప్పటియవధానుల పేరటివారొక కొంతతీసిపోయినఁ బోవుదురుగాక; వేదాక్షరమున్న పెట్టిదో, ఉచ్చరించియెఱుఁగక లౌకికశిఖామణులైవర్తిల్లు ప్రముఖులసన్నిధినేమి కేవలగృహ్యమంత్రాధ్యయనకావ్యపాఠాదులచేఁ బండితంమన్యులగుప్రాజ్ఞులపాలనేమి సర్వథా సమ్మాననీయులేయని కొన్నిప్రమాణములవలన మేమువిశ్వసించుచున్నాము. మఱియుఁ దర్కవేదాంతాదిశాస్త్రములను జ్యోతిర్వ్యాకరణాద్యంగములను, కేవలముగాఁజదివియుండి సదసద్విజ్ఞానధురంధరులై యుండు పండితులనుఞుల చెంతసైతము శుష్కాధ్యేతలయినను వేదపాఠకులే ప్రథమపూజార్హులని యుంగూడ శాస్త్రప్రమాణమునకు లోఁగి చెప్పవలసినవారముగుచున్నారము. చూడుఁడు.

విశ్వగుణాదర్శములో వెంకటాధ్వరి.

శ్లో॥ అనభ్యస్య వేదా న హేహా శాస్త్రవాదాః
పఠంతస్ఫుటం యే బహైతన్మతస్థాః

అధీశా ననాదృత్య తద్భృత్యపూజా
పరాణాం నరాణాం పదం తే భజన్తే॥

సర్వజ్ఞుండగు మనువు వేదాధ్యయనమును ద్విజాతి సాధారణముగా విధించుచు నియమపూర్వకాధ్యయనమునకు శ్రేష్ఠత్వమునుఁ బ్రతిపాదించువాడయ్యును నియమాచరణమందశక్తులగువారు వేదాధ్యయనమునకే జలాంజలులిచ్చుటకన్న నియమములను వదలిరైనను వేదముఁ జెప్పుకొనుట శ్రేయమని నిర్వచించియున్నాఁడు.

మనుస్మృతి 2 వ అధ్యాయము.

శ్లో॥ ఆహైవ సనఖాగ్రేభ్యః పరమంతప్యతేతపః
యస్స్రగ్వ్యపిద్విజోధీత్ స్వాధ్యాయంశక్తితోన్వహం॥

బ్రహ్మచర్యములోఁ బూలదండలు ధరించుటయున్నగునవి యెక్కువగా నిషేధింపఁబడినవి. ఇచ్చట, పూలు పెట్టుకొనిరైనను వేదాధ్యయనముఁ జేయుచుండుట గొప్పతపస్సు. అని చెప్పఁబడినది. అనగా, అందఱు నియమములందు త్యజించియే వేదమునభ్యసింపవలసినదని స్మృతికారుల యభిప్రాయముకాదు. అసలువదలుటకన్న నియమములు లేకరైనను వేదముఁ జెప్పుకొనుట శ్రేయోద్వయసాధనమని, యల్పాయుష్కులై రజస్తమోభిభూతులగుచుండు కలికాలమనుజులకుఁ బరమకారుణికుఁడగు మనువు దారిఁజూపినాడు.

దీనికి రెండవపూర్వపక్షము—చాలచోట్ల వేదమందే "యఏవం వేద,, ,,యఏవం విద్వాన్" మొదలయిన వాక్యవాక్యైకదేశములచే వేదార్థజ్ఞానమునకే ప్రాధాన్యమంగీకరింపఁబడినది కాని వేదపాఠమునకు, ప్రాశస్త్యము చెప్పబడలేదు. "యావతీర్వై దేవతాః = ప్రీణాతి" అను శ్రుతియందు "వేదవిది" అని వేదవేత్తయందే సకలదేవతాసన్నిధి కలుగుచుండునని చెప్పఁబడియున్నది. గాన వేదాధ్యయన మర్థజ్ఞానములేనిచో నిష్ప్రయోజనము. "అభ్యసేత్" ,,అధీయీత,, మున్నగు విధివాక్యములకును, అర్థజ్ఞానపూర్వకపరిశ్రమమందే తాత్పర్యము అనుటసరసము. యుక్తితో నాలోచించినను అర్థమెఱుఁగనివర్ణనమువలనఁ గార్యమున్నట్లు తోఁచదు. కావునఁ దమరుచ్చరించు మంత్రమునకు శ్రాద్ధమందుపయోగమో పెండిలియందుపయోగమో తెలియక ,,మయి మేధాం మయి ప్రజాం = సూర్యోదధాతు,, అను మొదలగు మంత్రములచే నొరులకు నాశీర్వాదములొన

ర్చుచుండుఘనులగు నవధానులవారి కేమనియఁగ్రి తాంబూలములీయఁగలము? అనికొంద
ఱు కాలుఁద్రవ్వుచున్నారు,

దీనికిసమాధానము__ "విద్వానేవవిజానాతి విద్వజ్జనపరిశ్రమం నహివంధ్యా
విజానాతి,గుర్వీంప్రసవవేదనామ్" అనినట్లు కూరుచుండి యెన్నికబురులైనఁజెప్పవచ్చు
ను కాని ముక్కవర్లించుటన్న మహాకష్టము. ఎవరైనను వేదముఁజెప్పుకొని తదర్థము
నుగ్రహించవలయుననియే ప్రప్రథమమున నారంభింతురు. శ్రమపడి పది పదియైదువత్సర
ముల కద్దానిని వాచోవిధేయముగాఁజేసికొనునప్పటికి నల్పశక్తిమంతులగు కలికాలపురు
షుల కోపికలుతగ్గిపోవుచున్నవి. ఇదికాక వేదవేదాంగముల యధ్యయన మొకపదిరెం
డుసంవత్సరములలోమాత్రమే ముగింపఁబడి ; వేదార్థసర్వస్వమునుఁ గరతలామలకముఁగ
ఁజేసికొనవీలగు నధ్యయనమార్గ మొకటు ప్రాచీనసంప్రదాయములలోనుండునది. అది,
పరమసాత్వికకాలమగు పూర్వయుగములలో శుద్ధసత్వసంపన్నులగు మునులు చెప్పు
చుండుటయు నంతకన్నఁ బరమసాధువులగు నంతేవాసులు చెప్పుకొనుచుండుటయుఁ
గలుగు సుదినములలో నిరంతరాయప్రచారమై నడచినది.

ఇప్పుడన్ననో, అయ్యది యందనిమ్రానిపండు. ఇప్పుడైనను సాధ్యమగునంత
వఱకు కొన్నిసంస్కారము లధ్యయనరీతికిఁజేయఁబడి ప్రకృతకాలానుగుణ్యముగాఁ
బాఠశాలాపద్ధతులతో బ్రహ్మచారులకు విద్యలుగఱపఁబడుచుండుట లేర్పడెనేని,
తాదృశవేదవేదాంగాధ్యయనము సమ్మితకాలములో సాధ్యమై, శ్రుతులనుగుహాలలో
మనపూర్వులగుఋషులచేఁగాని లేక పరమాత్మచేఁగాని దాచపెట్టఁబడియుండు పర
మార్థతత్వసిద్ధాంతముల ననాయాసముగ నరటిపండువలచిచేతిలోఁబెట్టినట్లు చెప్పఁగల
స్నాతకబ్రహ్మచారిశిరోమణుల శుభమూర్తులను మనము మనకన్నులచల్లగాఁ జూడ
గలుగుదుము. అట్టిసుకాలము రాకకై యాత్మోద్ధరణమభిలషించుమనమహాజనులకును
సర్వవిధముల మనశ్రేయమునకు కారణభూతులగుచుండు మనదొరతనమువారికిని సద్బు
ద్ధులనొసంగుచుంట కాపరమేశ్వరుని వేడుకొందము. చదువరులారా! యిదియప్రకృత
ము. ఈయధ్యయనవిధినిఁగూర్చి పలువిధములగుమార్పులు చేయఁదగినవిగాఁగనఁబడు
చుండి నామనశ్శపథమునకుఁ బిలువనిపేరంటముగావచ్చుచుండుటంబట్టి యిట్లు శాఖా
చంక్రమణ మొనర్చితి ఇకఁబ్రకృతవిషయమునకుఁజేరుకొందము వేదార్థము గొడవయె
ఱుగక యూఱక క్రమము, జట, ఘనము, మఱియు నేవోయేవో అనిపెట్టుకొని జందెము
లుమడతలువేయుచుండుట యెక్కవగొప్పసంగతియని నేనెన్నటికినిఁ జెప్పసాహసించ.

అర్థముఁ దెలిసికొనుటకూడ, ఆవశ్యకతమములలో నొక్కటియనుట నిర్వివాదమేకాని యర్థజ్ఞానములేమిచే మంత్రము నిష్ఫలమగునని చెప్పసాహసించుట తప్పు. గర్భాష్టమ సంవత్సరమున బాలున కుపనయనముజేయుచు గాయత్ర్యుపదేశముఁ జేయవలసినదని విధియున్నదికదా. ఎంతటిప్రతిభాశాలికైనను, ఏడేండ్లకుఱ్ఱనికి గాయత్రీమంత్రార్థము గోచరమగునా? అర్థముగోచరముకాకున్నమాత్రమున నాగాయత్రి యాతనికి ఫలము నీయదా? ఈయకపోయిన నప్పుడాయుపనయన మాతని కేలవిధించఁబడియుండును! గనుక మంత్రాక్షరోచ్చారణమందును సిద్ధ్యనుకూలమహిమకలదని మనపూర్వులగు మహాత్ములయభిప్రాయము. «యంయంక్రతుమధీతే తేనతేనాస్యేష్టంభవతి» అని శబ్దబ్రహ్మముకూడ వేదపఠనమున కెక్కువమహిమను వర్ణించుచున్నయది.

సర్వసమ్మతమగు వేదార్థజ్ఞానప్రాశస్త్యమునకు, ప్రధానత్వమొసంగుటచే వేదవేత్తకన్న వేదపాఠకుఁడొకయడుగు వెనుకనడవవలసినవాఁడైనను, వేదాధ్యయనమెఱుంగక తదితరవిద్యాపాండిత్యమెంతగాఁగలిగినవారైనను వారిముందఱమాత్రము వేదపాఠకులగువిప్రులయగ్రపూజ కేవిధమయినహానియు నుండగూడదు. చూడుఁడు. ఈ భేదములనుఁగూర్చి మను విట్లుశాసించుచున్నాఁడు.

మనుస్మృతి (౧౨) అధ్యాయము.

శ్లో॥ అజ్ఞేభ్యో గ్రంధినశ్శ్రేష్ఠాః। గ్రంధిభ్యో ధారిణోవరాః
ధారిభ్యో జ్ఞానినశ్శ్రేష్ఠాః। జ్ఞానిభ్యో వ్యవసాయినః॥

వేదముఁజెప్పకొనియెఱుఁగనివారికన్నఁ బుస్తకముఁజూచి వేదముఁజదువఁగలవారుత్తములు. పుస్తకముఁజూచిచదువుపాటియధ్యయనముకలవారికన్నఁ బుస్తకాపేక్షయించుకంతయేనిలేక స్వరాక్షరవ్యత్యాసము లవమైన, తటస్థించకుండ వేదమును, కనులుమూసికొనిచెప్పఁగలవా రధికులు. అంతకన్న వేదవేదాంగాధ్యయనసంపత్తిచే వేదార్థమునెల్లఁ గరతలామలకముగఁజేసికొనినవారు పూజ్యులు. అట్టిసాంగాధ్యాపకులగు వేదార్థవేత్తలకన్న సంపూర్ణమగుమంత్రసంపత్తియు, తదర్థజ్ఞానవైదుష్యమును, కలిగి వేదవిహితసకలకర్మానుష్ఠానతత్పరులైయుండు పరమశాంతు లుత్కృష్టగౌరవార్హులు.

ఇట్లు ప్రమాణశతములచేతనిర్ణయింపఁబడియున్న వేదపాఠకులయగ్రపూజార్హత్వ ముఁదొలఁగించుట కెవరుశక్తులు? గాననిప్పుడు వన మేవో యూర్ధ్వలు పెట్టికొని యాత మలపాకుచీలికల నేయనామధేయశిరోమణులకో యిచ్చికొనినను మంత్రపవిత్రాంతఃకర

ణులగు నావేదాధ్యేతల కేలాటికొఱంతయును లేదు. వా రట్లెట్లో గాలికి బ్రతుకుచునే యుంద్రు. మనముమాత్రము పూజ్యపూజావ్యతిక్రమముచేఁ బతితులమగుచు నరకార్జనముఁ జేసినవారమగుదుము.

గాన నో స్వదేశీయులగుమిత్రులారా! ఆస్తికులారా! శాస్త్రప్రామాణ్యముఁ దృణీకరించకుఁడు. శ్లో॥ "తస్మాచ్ఛాస్త్రంప్రమాణంతే కార్యాకార్యవ్యవస్థితౌ,, అని శ్రీకృష్ణభగవాను లర్జుననంతవానికిఁగూడ శాస్త్రమునకులొంగుమని యుపదేశించె. అదిగాక యేదోకొంచెమాస్తికత్వముతోఁబెనగులాడుమన మేశాస్త్రమును లక్ష్యము సేయనిచో నింక వానిదిక్కుఁజూచువా రెవరు? మనము హేతువిచారణఁ జేయసమకట్టినను ఈయగ్రతాంబూలములుమున్నగుగౌరవహేతువులగుబహూకృతులు విద్య, మతము, జ్ఞానము మొదలగువానిప్రోత్సాహమునకు బుట్టినవికాని నిరర్థకముగాఁబుట్టియుండలేదు. అట్టియెడ విద్యాధికులగౌరవించుచుంటిమేని విద్యయభివృద్ధిగాంచు. విద్యాభివృద్ధిలోననే మనుష్యునియభ్యుదయములన్నియు నిలీనములైయున్నవి. వైదికజ్ఞానమునువిడనాడిన యేజ్ఞానములును విద్యలని చెప్పఁబడవని ఋషులమతముకన్పట్టెడి. ఇంగ్లీషుచదివినవారికి మహోపదవు లిప్పటిదొరతనమువారిచ్చుటంజేసి యాంగ్లభాషిత మనుదినాభివృద్ధినెట్లందుచుండెనో; అట్లే పూర్వము రాచరికమువారు వేదవిద్యాసంపన్నుల కుత్కృష్టగౌరవముఁ జూపుచుండుటంబట్టి తత్కాలమున వేదశాస్త్రవిద్యాభరణభూషితమై లౌకికపారమార్థికజ్ఞానముల కాటపట్టై మనయీ భరతభూమి దేశాంతరముల నపహసించె. వేదవిద్యాధికులయెడ, పూర్వరాజన్యుల గౌరవమునుఁజూడుఁడు.

మనుస్మృతి—మ్రియమాణోప్యాదదీత, నరాజా శ్రోత్రియాత్కరం
నచక్షుధాఽస్యసంసీదేత్ శ్రోత్రియో విషయేవసన్

రాజు తనకు రాబడి చాల, తక్కువగానున్నకాలములోసైతము వేదముఁజెప్పుకొనిన బ్రాహ్మణునుండి శిస్తుదీసికొనఁగూడదు. అనిదీనియాశయము.



# కృష్ణకవ్యభిప్రాయఖండనము.

చదువరులారా!

రాజమహేంద్రవరపురనివాసులగు బ్ర॥ కవిరాజు శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిల గారు "భట్టబ్రహ్మమతఖండనము" ను శీర్షికక్రింద నొకవ్యాసము వ్రాయుచున్నవారలు. ఆవ్యాసము కాకినాడపురవాస్తవ్యులును, ఆధునికాంధ్రలోకసద్విమర్శకశిఖామణులును నగు బ్రహ్మశ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిలగా రార్యమతబోధినిలోఁ బ్రచురించుచున్న "కురుపాండవదాయనిర్ణయప్రకాశముపై విమర్శనమైయున్నది. విమర్శనఁజేయుట యుక్తమేకాని శ్రీ. కృ. శాస్త్రిగారు ప్రస్తుతమునఁ బ్రచురపరచువిమర్శన మాత్రము శ్లాఘాపాత్రముకాదనియె నాతలంపు. శ్రీ. కృ. శాస్త్రిగా రావ్యాసమునకు "భట్టబ్రహ్మమతఖండన" మని శీర్షికనుంచిరి. ఇది కా. బ్ర. శాస్త్రిగారి గృహనామధేయాదుల "నామైకదేశే నామగ్రహణం" మ్మను దానిననుసరించి గైకొనియుంచిరని తోఁచుచున్నది. ఈశీర్షికవలన బ్రహ్మయ్యశాస్త్రిగారిమతము సన్మతమైనను దుర్మతమైనను శ్రీ. కృ. శాస్త్రిగారు ఖండింపసమకట్టినట్టు నాకుఁబోడఁగట్టుచున్నది. లేనియెడలఁ బైమాడ్కినిశీర్షికనుంచక ప్రస్తుతవిషయమగు కురుపాండవదాయమునకు సంబంధించిన శీర్షిక నుంచెడివారలు. శ్రీ. కృ. శాస్త్రిగారివలె మంచికిఁ జెడ్డకు నుపయోగించుశీర్షికఁ బెట్టఁబడక చెడ్డకు మాత్రముపయోగించుశీర్షిక నాచేఁ బైరీతిని "కృష్ణకవ్యభిప్రాయఖండన" మనియుంచఁబడినది. శ్రీ. కృ. శాస్త్రిగారు తమవ్యాసమునందు "నన్నయభట్టు నాదికవియనుట యవిమర్శము............ఇతఁ డాదికవికాఁడు. ఇందు వీరినన్నయభట్టారకచారిత్రము యథేష్టసంకలితము. వీరివాదముకువాదము" అని వ్రాసిరి నన్నయభట్టే తెలుఁగుకయిత కాదికవి కానప్పు డిఁక నెవరో యెఱుకఁజేయవలసియున్నది. కాన ముందుగా శ్రీ. కృ. శాస్త్రిగారు సప్రమాణముగా సహృదయహృదయంగమముగా నన్నయభట్టాదికవి కాఁడని దృఢపరచి తరువాత నాదికవియనుట యవిమర్శమనియో కువాదమనియో యేదియో వారియిష్టమువచ్చినది వ్రాయవచ్చును. శ్రీ. కా. బ్ర. శాస్త్రిగారి నన్నయభట్టారకచారిత్రమునందలివిషయములన్నిటిని విజ్ఞమనోజ్ఞముగా ఖండించి తదుపరి దానిని యథేష్టసంకలితమని వ్రాయవచ్చును. అంతియకాని ముందుగా నిటులఁ దూలుగా వ్రాయుట భావ్యమగునా? ఏవో రెండు ఇంగ్లీషుకాంటేషనులు పెట్టి తాటాదూటము జేయుటకు వీలులేద" ని శ్రీ. కృ. శాస్త్రిగారు వ్రాసిరి. కా. బ్ర. శాస్త్రిగారు మొదల మనపూర్వులను బ్రమాణీకులుగాఁ గైకొని పిదప హూణపండితాభిప్రాయములనుగూడ బ్రమాణములుగా గైకొనుచుందురు. ఇదియుగూడఁ దప్పేకాఁబోలు. వహ్వారేవహ్వా "ధృతరాష్ట్రోభిషేచితః" అనునది......వ్రాతతాటియాకుల ప్రతులందును లేదు ఒక్క కృష్ణమాచార్యులు ముద్రించిన క్రొత్తప్రతిలోమా

త్ర మున్నది. అది ప్రక్షిప్తమని నేను చెప్పియేయున్నాఁడ,,నని శ్రీ. కృ. శాస్త్రిగారు లిఖించిరి. 'ధృతరాష్ట్రోభిషేచితః, అనునది ప్రక్షిప్తము కాదని దృఢపఱుప శ్రీ బ్రహ్మయ్యశాస్త్రిగారు విశాఖపట్టణము వేట్లపాలెము, మండపేట మున్నగు వ్రాత ప్రతులందు నీశ్లోకమున్నట్లు ప్రాజ్ఞవిశ్వసనీయముగా వ్రాసిరి. దీనికి శ్రీ కృ. శాస్త్రిగారు "ఆవ్రాతకు సరిపడ నేనుగూడ హంసేనుపురము, పుణ్యక్షేత్రము, చక్రద్వారబంధము, నత్తలరామేశ్వరము, కాశీబుగ్గ మున్నగు ప్రదేశములలోఁగల ప్రతులలో లేదని వ్రాసిన నెట్లుండునో మాచదువరులే గ్రహింతురుగాక. ఇదియా వ్రాయవలసిన సమాధానము" అని వ్రాసిరి. అబద్ధము వ్రాసినపట్లఁ గదా పైవిధమునఁ బరిహసించి వ్రాయుటకు దావువచ్చునది. బ్రహ్మయ్యశాస్త్రిగారు వ్రాసిన ప్రమాణములకంటె నెక్కువ ప్రమాణములఁ జూపి వానిని ఖండించి పరిహసించిన బాగుండును. "ఇదిగాక పుల్లయ్యవ్రాసె నెల్లయ్యవ్రాసెఁ జిన్నయ్యవ్రాసెఁ బెద్దయ్యవ్రాసెనని చెప్పుచున్నారు" అని వ్రాసిరి. ఈ శ్రీ. కృ. శాస్త్రిగారు సంవత్సరము క్రిందట గురుపాండవదాయభాగవిమర్శనమును నొకదానిని మానవసేవలోఁ బ్రచురించియున్నవారలు దానిఁ జూచుటతోడనే కొంద అపహ్యాముఁ జెంది ప్రమాణరహితముగానున్నదని యెంచి పూర్తిగా ఖండించియున్నవారలు. వారు వ్రాసినదానికి శ్రీ. కృ. శాస్త్రిగారు సమాధానము వ్రాయలేక మిన్నకుండి యిప్పుడు వారినిగురించి "పుల్లయ్యవ్రాసె నెల్లయ్యవ్రాసె,,నను మొదలగు వాక్యములను నిర్లక్ష్యముగా వ్రాయుచున్నారు. ఇది న్యాయమేనా? వీరిట్లు వ్రాసినంతమాత్రమున వారికేమియు లోటుకలుగఁబోదు "ధృతరాష్ట్రోభిషేచితః,, ఇదిమాత్రము ప్రక్షిప్తమని యేలయొప్పుకొనరో తెలియకున్నది ఇది తానుపట్టినకుందేటికి మూడేకాళ్లనినట్లున్నద,,ని వ్రాసిరి. బ్రహ్మయ్యశాస్త్రిగారు పైశ్లోకము ప్రక్షిప్తము కాదని యనేకప్రమాణము లగుపరచుచున్నప్పుడు ప్రక్షిప్తమని యేలయొప్పుకొనెదరు? ప్రమాణములు చిక్కినప్పుడు నొప్పుకొనఁగలరు. కాబట్టి తానుపట్టినకుందేటికి మూడేకాళ్లనినట్లున్నదని వ్రాయుట సరిగాదు. "ఇట్టితప్పుపాఠమును జర్చించి విచారించుచుం గాలహరణముచేయుట కప్పుడు నిప్పుడు సమ్మతములేనివాఁడంగాన నీవిషయ మిప్పటికింతతో ముగించి మరియొక విషయము ప్రస్తుతమునకుఁ దెచ్చుచున్నాను" అని కృ. శాస్త్రిగారు వ్రాసిరి. పైశ్లోకము శ్రీ కృ శాస్త్రిగారు ప్రక్షిప్తమని కొట్టి కోలాహలము జేయుచున్నారు. కా. బ్ర. శాస్త్రిగారు ప్రక్షిప్తము కాదని సప్రమాణముగా దృఢీకరించుచున్నారు. ఇది విచారణీయాంశమే కదా. ఇట్టిపట్టునఁ గాలహరణమన్న నెట్లు? కాఁబట్టి తొందరపడక దానిని విమర్శింపవలసియుండును. కావునఁ గవిరాజబిరుదాంచితులును సంస్కృతాంధ్ర భాషాకోవిదులును విమర్శకులును మానవసేవా పత్రికాధిపతులును నగు బ్రహ్మశ్రీ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రులుగారు తమసామర్థ్యమంతయుఁ దూలుమాటలయం దుపయోగించక విషయవిమర్శనమందె వినియోగించి లోకమునకు మహోపకారము జేయఁ గడంగుదురుగాక యని వేఁడుకొనుచు నావ్యాసమును ముగించుచున్నాను.

11—5—1914
సికింద్రాబాదు.

బుధజనవిధేయుఁడు,
చిప్రకుంల అప్పయ్యశాస్త్రి.

వంచితసీమనుండ భయమంతయుమాని చరింతు నెయ్యెడన్ 44

శ్లో॥ ఛందశ్శాఖిశిఖాన్వితై ర్ద్విజవరై స్సంసేవితే శాశ్వతే
సౌఖ్యాపాదిని ఖేదభేదిని సుధాసారైః ఫలై ర్దీపితే
చేతఃపక్షిశిఖామణే!త్యజ వృథాసంచారమన్యైరలం
నిత్యం శంకరపాదపద్మయుగళీనీడే విహారంకురు

శా॥ వేదాంతావనిజాగ్రయుగ్ద్విజమునుల్ విఖ్యాతసౌఖ్యామృతా
పాదంబుం బృథుఖేదభేది ఫలవిస్ఫారంబునౌ శూలిస
త్పాదాంభోజకులాయమందున సదావర్తించు మోహానస
ప్రాధాన్యాండభవంబ!చాలును వృథాపైనంబు లింకేటికిన్ 45

శ్లో॥ ఆకీర్ణే నఖరాజికాంతివిభవై రుద్యత్సుధావైభవై
రాధౌతేపిచ పద్మరాగళలితే హంసవ్రజై రాశ్రితే
నిత్యం భక్తివధూగణైశ్చ రహసి స్వేచ్ఛావిహారంకురు
స్థిత్వా మానసరాజహంస! గిరిజానాథాంఘ్రిసౌధాంతరే

ఉ॥ శంకయొకింత లేక యనిశంబుచరింపుము రాజహంస మా!
శంకరపాదపద్మమణిసౌధమునందున, హంసరాజి యా
వంకఁ జెలంగు, దివ్యనఖవైభవ మచ్ఛసుధావిభూతియున్
బంకజరాగదీప్తియును భక్తిసతీతతి గల్గు నచ్చటన్ 46

శ్లో॥ శంభుధ్యానవసంతసంగిని హృదారామేఘజీర్ణచ్ఛదాః
స్రస్తా భక్తిలతాచ్ఛటా విలసితా పుణ్యప్రవాళాశ్శ్రితాః
దీప్యంతేగుణకోరకా జపవచఃపుష్పాణి సద్వాసనాః
జ్ఞానానందసుధామరందలహరీ సంవిత్ఫలాభ్యున్నతిః

మ॥ శివ!త్వద్ధ్యానవసంతసంగియగు మచ్చేతోవనిం బాపవి
చ్ఛవిపర్ణంబులురాలి పుణ్యచయమై శాల్యప్రవాళంబులన్

స్తవపుష్పంబుల సత్సువాసనలచేఁ భక్తిపీరుత్తు లా
భవహించెం గుణకోరకంబులను దివ్యజ్ఞానపుంబండులఁ 47

శ్లో॥ నిత్యానందరసాలయం సురమునిస్వాంతాంబుజాతాశ్రయం
స్వచ్ఛంసద్ద్విజసేవితం కలుషహృత్సద్వాసనావిష్కృతం
శంభుధ్యానసరోవరం వ్రజ మనోహంసావతం సంస్థిరం
కింక్షుద్రాశ్రయపల్వలభ్రమణసంజాతశ్రమం ప్రాప్యసి

శా॥ సంతోషాంబుయుతంబుమౌని హృదయాబ్జాతాశ్రయంబుఁ శుభా
క్రాంతోద్యద్ద్విజసేవితంబు కలుషవ్రాతక్షయామోదమా
కంతుద్విట్స్తవసత్సరోవరమునం గాలంబువెళ్లించుపో
చింతంజేయక పల్వలభ్రమణ మోచిత్తాఖ్యసద్ధంసమా! 48

శ్లో॥ ఆనందామృతపూరితా హరపదాంభోజాలవాలోద్యతా
స్థైర్యోపఘ్నముపేత్య భక్తిలతికా శాఖోపశాఖాన్వితా
ఉచ్చైర్మానసకాయమానపటలీమాక్రమ్య నిష్కల్మషా
నిత్యాభీష్టఫలప్రదా భవతుమే సత్కర్మసంవర్ధితా

శా॥ ఆనందామృతపూరితంబు హరపాదాబ్జాలవాలోద్యతం
బై నిద్దంబగుస్థైర్యదారువు కరం బాధారమై క్రాలఁగా
నానాశాఖలువెట్టిచిత్తమను మేల్నవ్యంపుఁబందింటికిఁ
మానైబ్రాఁకినయట్టి భక్తిలత వేమా కిష్టదంబయ్యెడిఁ 49

శ్లో॥ సంధ్యారంభవిజృంభితం శ్రుతిశిరస్థానాంతరాధిష్ఠితం
సప్రేమభ్రమరాభిరామమసకృత్సద్వాసనాశోభితం
భోగీంద్రాభరణంసమస్తసుమనఃపూజ్యం గుణావిష్కృతం
సేవే శ్రీగిరిమల్లికార్జునమహాలింగం శివాలింగితం

శ్లో॥ ధర్మోమేచతురంఘ్రి కస్సుచరితః పాపంవినాశంగతం
కామక్రోధమదాదయో విగళితాకాలాస్సుఖా విష్కృతాః
జ్ఞానానంత్యమహౌషధిస్సుఫలితా కైవల్యనాథేసదా
మాన్యే మానసపుండరీకనగరే రాజావతంసే స్థితే

శా॥ రాజోత్తంసుఁడు మాన్యుఁడీశుఁడు మనోరాజీవపూర్వాసిగా
భ్రాజద్ధర్మము నాల్గుకాళ్లనడచెం బాపక్షయంబయ్యె నా
యాజన్మోద్గతశత్రుషట్కమడఁగెన్ హాయింగనెం గాలముల్
రాజిల్లెం గడు జ్ఞానసాధనమహాగ్రంథాల్ ఫలోపేతలన్ 39

శ్లో॥ ధీయంత్రేణ వచోఘటేన కవితాకుల్యోపకుల్యాక్రమై
రానీతైశ్చ సదాశివస్యచరితాంభోరాశిదివ్యామృతైః
హృత్కేదారయుతాశ్చ భక్తికలమాస్సాఫల్యమాతన్వతే
దుర్భిక్షాన్మమ సేవకస్య భగవన్ విశ్వేశ!భీతిఃకుతః

ఉ॥ మానసయంత్రయుగ్వచనమంజులభాండమునం గవిత్వకు
ల్యానుసృతంబులైన యసమానశుకథాంబుధిజీవనంబులన్
ధీనవభూమికిన్ సరిగఁ దెచ్చుచు భక్తిసమాఖ్యశాలుల
న్మానుగఁబండఁజేసిమను నాకెటుతామభయంబుగల్గదేన్ 40

శ్లో॥ పాపోత్పాతవిమోచనాయ రుచిరైశ్వర్యాయ మృత్యుంజయ!
స్తోత్రధ్యాననతిప్రదక్షిణసపర్యాలోకనాకర్ణనే
జిహ్వాచిత్తశిరోంఘ్రిహస్తనయనశ్రోత్రై రహంప్రార్థితో
మా మాజ్ఞాపయ తన్నిరూపయముహుర్మామేవ మామేవచః

శా॥ గోత్రావాస!విభూతిలాభమునకున్ ఘోరాఘనాశానకున్
స్తోత్రధ్యాననతిప్రదక్షిణలసత్పూజేక్షణాకర్ణనల్

గాత్రంబౌరసనాత్మశీర్షపదసత్పాణ్యక్షికర్ణంబుల
నైమైత్రిం ప్రార్థితుఁడైతి నిచ్చిసెలవుల్ నాకు న్నిరూపింపుమీ 41

శ్లో॥ గాంభీర్యం పరిఘాపదం ఘనధృతిః ప్రాకార ఉద్యద్గుణ
స్తోమ శ్చాప్తబలం ఘనేంద్రియచయో ద్వారాణి దేహస్థితః
విద్యా వస్తుసమృద్ధి రిత్యఖిలసామగ్రీసమే తేసదా
దుర్గాతిప్రియ! దేవ! మామకమనోదుర్గే నివాసంకురు

శా॥ గాంభీర్యం బొకఖేయమై సుధృతి ప్రాకారంబుగానై గుణా
రంభం బై బల మింద్రియవ్రజము మేల్ ద్వారాళియై జ్ఞానము
న్జృంభద్వస్తుసమృద్ధియై యిటుల నీనూత్నంపుసామగ్రిచే
తం భాసిల్లెడి చిత్తదుర్గమును స్వస్థానంబు గావింపుమీ 42

శ్లో॥ మాగచ్ఛత్వ మిత స్తతో గిరిశ! భో మయ్యేవ వాసంకురు
స్వామి న్నాదికిరాత! మామకమనః కాంతారసీమాంత రే
వర్తంతే బహుశో మృగా మదజుషో మాత్సర్యమోహాదయః
తాఁ హత్వా మృగయావినోదరుచితాలాభంచ సంప్రాప్స్యసి

శా॥ ప్రేమన్ మున్ను కిరాతనామమునఁ గీర్తింగాంచివర్తించునో
స్వామీ! మామకచిత్తదుర్గమవనవ్యామోహ రాజన్మృగ
స్తోమంబుం బరిమార్చి నన్నిటఁ గృతార్థుం జేసి నాయందె ని
త్యామోదంబుననిల్చియుండుమని నీ కశ్రాంతమున్ మ్రొక్కెదన్

శ్లో॥ కరలగ్నమృగః కరీంద్రభంగో ఘనశార్దూలవిఖండనో స్తజంతుః
గిరిశో విశదాకృతిశ్చ చేతఃకుహరే పంచముఖో స్తి మే కుతో భీః

ఉ॥ సంచితహస్తలగ్నమృగశాబకమున్ మదనాగభంగ ఘు
భ్యంచిత వ్యాఘ్రసంహరణ మస్తసమస్తప్రశస్తజంతుస
త్సంచయమైన పంచముఖసత్కుల నా హృదయాద్రికందరో

చ॥ తమకునుమాకునుంగలుగు దారుణపుంబగ మాగ్రామునన్
శ్రమకలిగింత్రుగాక కడుసాక్ష్యముపల్కఁగ,నింతమాత్రనే
విమనస్కుఁడై యిట్టుల్ పలుకు వీరయయోగ్యత యేమనన్వలెన్
దమకరణాలెపల్కె "ఔదిత"ప్పనియెందఱో నిందసేయుచున్ 151
క॥తనపితనుడియన్న "తముకా' దనుసుందరరామయాఖ్యుఁడను నేమోకా
తనకున్ మాకరణాలకు ఘనబంధుతయుండియుంట కల్లయటంచున్
* క॥ మాదినపాటిద్విజాతులు
మాదమసంప్రోక్షణంబుమాకే యెఱుఁగర్
"కా దెఱుఁగుదు" రనియే యనుఁ
డా దేవతగొల్వరంట యవ్వారెపుడేన్ 153
క॥ పెదయగ్రహారమందఁట
చదివినకమసాలెయంట సంప్రోక్షణముల్
గుదురుగఁజేయించునఁట
య్యది యెంతయథార్థమగునొ యరయుఁడు ప్రాజ్ఞుల్! 154
క॥ ఉన్నవినలుబడికొంపలు
ఎన్నఁడునట బత్తులుండు టెఱుఁగర యెవరే

---

* బ్రహ్మశ్రీ జానపాటి పట్టాభిరామశాస్త్రిగారి దివ్యసముఖమునకు.

విన్నపములు పల్లిలక్ష్మీనారాయణ కృతనమస్కారపూర్వకముగా వ్రాయుచున్నది.

అయ్యా! నాకు 50 సంవత్సరములవయస్సు వున్నది. నేనెరిగినతర్వాత మా గ్రామములో ఏదేవతకుగాని కమసాలలచే ప్రతిష్టచేయించబడియుండలేదు. మా గ్రామములోమాదమ్మ యనునొకదేవత వున్నమాట వాస్తవము. ఆ దేవతకు కొలుపులలోగాని యితరసమయములలోగాని శూద్రాదులు బోనములుచెల్లించి కొలుచుటయే తప్ప బ్రాహ్మణులు కొలుచుట ఎన్నడును లేదు. బ్రాహ్మణులు తమయిండ్లలో తామె దేవతపేరుజెప్పి నైవేద్యములు పెట్టుకుందురు. ఇంతేసంగతులు, చిత్తగించవలయును.

పల్లి లక్ష్మీనారాయణవ్రాలు.

నెన్నికగన్నకలాదునె
క్రన్నవీరయ్యగారు కల్పించిరిగా 155

ఉ॥ వీరయగారికింజతగ వెంకయగారొకరేగుదెంచె "మా
యూర నెదో ప్రతిష్ఠ యయియుండెనుబత్తులనుండి" యంచు, నా
పే రెవరేని నెప్పుడును విన్నదికన్నదికాడఁగాదు, మా
వారికినెట్టిలోదొరకె, వాసిగడించె వచించిసాక్ష్యముఁ 156

* ఉ॥ దాచెపలిం బ్రసిద్ధుఁడుకదా యరయంగను బిచ్చిరెడ్డితాఁ
జూచిన నింకనుంగలరు సువ్రతులెందఱో, యిందఱుండ నే

---

* దాచేపల్లిపురవర్ణన.

చ॥ వరదాచేపలివంశనాయక మహోవారాశికిఁ నిండుచం
దురుఁడౌ వెంకటసుబ్బయాఖ్యుఁ డెపుడుం దోట్పాటుగానుండఁగాఁ
బరభీముండగుపేరిరెడ్డి యెదుటఁ భాసిల్లఁ గోలాకులాం
బురుహాదిత్యుఁడు పిచ్చిరెడ్డి నిరతంబుఁ సల్పు దీనఁ సభఁ॥ 66

క॥ వేంకటసుబ్బయమంత్రిఁ గ। శంకరహితుఁబొగడ నేను లావరినటవే...... 67

ఉ॥ సంకటమొందునప్పుడును...పంకవిదిగ్ధదేహులను బాయకయుండిమెలంగునప్పుడుఁ
బొంకకయుండునీతఁడు......... 68

క॥ సత్యహరిశ్చంద్రుండని। నిత్యముబుధవర్యులెన్న నేర్పరియగుచుఁ
వ్రాత్యుల కతిదూరుండై। కృత్యముసలుపుచునితఁడు క్షంభినినిలిచెఁ॥ 69

తే॥ ఇట్టికిరణంబుతోఁగూడి రట్టులేక। పిచ్చిరెడ్డియు సల్పెడిఁ బెద్దసభను...... 70

క॥ దుష్టజననిగ్రహంబును। శిష్టజనానుగ్రహంబు సేయఁగనితనిఁ......విధించె... 71

సీ॥ హేడ్కాలెక్టరుమొదల్ హేమాహేమీలకు సన్నైలొనర్చితా సైయనఁబడె
డిస్ట్రిక్టుబోర్డులో శీవిగుల్కుచు నొక్క మెంబరుతానయి మెప్పువడసె
కఱవుల నిఱుపేదనరులఁదానరయుచుఁ గబళముల్ వేయించి ఘనతగాంచె
సర్కారులోఁగూడ "సత్యవంతుం" డని క్యారక్టరుపొందితాఁ గడుఁజెలంగె
గీ॥ దాచెపలిలోన చేర్మెను తానెయగుచు। జనులకారోగ్యమిడి చాలఁ జతురతగనె
ధురితపథవర్తులైనట్టి నరులపాలి। పిడుగనందగునట్టి యాపిచ్చిరెడ్డి॥ 72

నీచునిసాక్ష్యమో మనము నిశ్చయముం చెటునమ్మనో మీ
గ్రోచనసేయుఁడీ చదువరుల్ కడుబాగుగ మానసంబులన్ 157

ఉ॥ ఈతఁడెదో యకార్య మిహిహీయన నెల్లరు చేసెనంటయా
హేతువుచేత బ్రాహ్మణు లనిష్టత నీతనియింటఁ బెండ్లిరా
నాతటి నేగకుండిరఁట, యప్డుకలాదులువచ్చి కార్యమే
రీతిను వెళ్లబుచ్చిరఁట ప్రీతియఁ టప్పటినుండి వారిపైన్ 158

---

ఉ॥ ఇట్టిఘనుండితండగుట నీతని పేరు సమస్తదిక్కులం
దట చరించి సత్పురుషసంగముదాల్చి యజస్ర మీతనిన్
జుట్టివసించెనాఁగ రణశూరుఁడు దుష్కృతదూరుఁడైన తోఁ
బుట్టువు పేరిరెడ్డియును బూర్వజు మ్రోలవసించు నెప్పుడున్॥ 73

చ॥ ......కవిజనసంచయంబునకు గౌరవ మొప్పఁగఁజేయ నేర్చియున్
భువిను నెఁబేరిరెడ్డియుటఁ బూర్వజునానతిమీఱకే రహిన్॥ 74

By command of His Excellency the Viceroy and Governor-General in Council this certificate is presented in the name of his most Gracious Majesty King Edward VII; Emperor of India, to M.R.Ry. Kola Pitchireddi Garu, son of Narisireddi Garu in recognition of his services as a Headman and as Chairman of the Dachepalli Union.

Madras
1st January. 1903

(Sd) ..... ... .. .....
Chief Secretary to the
Government of Madras.

(True Copy)

...... George V., Emperor of India, on the occasion of His Majesty's Coronation Durbar at Dehli to M. R. Ry. Kola Pitchireddi Garu, son of China Narisireddi Garu; in recognition of his services on Local Boards.

Madras.
12th December 1911

(Sd) Hon. W. STUART.
ag. Chief Secretary to the
Government of Madras.

(True Copy)

ఉ॥. అందున నేగు దెంచెనితఁ, డయ్యది సత్యమొ యైనఁ బెద్దలే
యెందుకు రాక యుండ్రు, నిజమే యగుఁగా వుత, నేరొ చేసినారొ
పందలటంచు నందఱికిఁ బథ్యముగాదది, యట్లచూచినన్
గొంద అసుల్ హరింతు రదికూడఁ బరిగ్రహ యోగ్యమే కదా 159

* ఆ॥ ఈయనామధేయుఁ డిటు పల్క తర్వాత
సత్యమరయఁ గోరి జాబు వ్రాయ
జరుగ లేదయిచట సంప్రోక్షణం బంచుఁ
బ్రీతి నిడెజవాబు పిచ్చిరెడ్డి 160

ఉ॥ "ఆయెఁ బ్రతిష్ఠ దా చెపలి నాయెను మాదినపాటిలోన" నం
చీయుభయుల్ వచించినది యెంతయథార్థమొ తేల్చినాఁడ. మా
వ్రాయసకాండ్రు "బ్రాహ్మణులు వచ్చిరి యిష్టముతోడ" నంచు నే
మో యనుకూలతం బలికి యుండిన సాక్ష్యమొ కింత చూడనౌ 161

సీ॥ స్వర్ణకారులచేత సంప్రోక్షణంబులం
జేయింత మనిమున్న చెప్ప లేదు
"అతనికి కార్యంబు నాచరించుటలోన
నర్హతకలదె" యం చడుగ లేదు
అతనిఁదోడ్తేఁ బోవు నవసరంబునఁ గూడ
నడిగి యభీష్టంబు పడయ లేదు
అతఁ డరుదెంచిన యాపల నైననుం
బిలిచి యాసంగతి దెలుప లేదు

---

* శ్రీ జానపాటి పట్టాభిరామ శాస్త్రులువారి సముఖమునకు.

వి. కోలా పిచ్చిరెడ్డి దండములు పెట్టి వ్రాసుకున్నది.

యీ గ్రామంలో వున్న...అంకాళమ్మ అనే శిలను పూర్వము యెప్పుడు ప్రతిష్టచేసినారో మాకు తెలియదు....శిల శిథిలమయినందున క్రొత్తది వకటి షుమారు 15 సంవత్సరములకిందట తెప్పించి తిర్గి స్థాపన చేయించినాము. వక యంత్రబిళ్ళ కంసాలిబత్తుడుచేత చేయించి దానిక్రింద వేసి విగ్రహమును నిలువబెట్టించినాముగాని శాస్త్రిప్రకారము ప్రతిష్టచేయించివుండ లేదు.

చిత్తగించవలెను, విధేయుడు, కే. పిచ్చిరెడ్డి.

సర్వ మైపోవుచుండెడి సమయమందు
గ్రుడ్డులాటలకేగుటల్ కూడవనుచు
మంచిమాటలచే మందలించినట్టి
బ్రాహ్మణుల్ దీనికిఁక నిష్టపడుటయెట్లు॥ 162

క॥ ఎందుకనిచెప్పికొందుమొ।
యెందులకని యప్రతిష్ఠ కేగుదుమోమే
మందఱు, మిదియాలించిన
మందునకేఁ నమ్మకంబు మదిఁగలుగునొకో॥ 163

క॥ కులమునకధికుండనియో
యలఘుకలాకలితుఁడనియొ యేంరథకారుఁ
బిలిపించి యప్రతిష్ఠలు
సలిపించుటకిష్టపడుట సకలమహీసురుల్॥ 164

సీ॥ చాలకాలమునుండి సంవర్ధితంబైన
యస్మదగ్రజుమీఁది యాగ్రహంబు
వశులై మెలఁగని వైదికజనులపై
నావిర్భవించు నీర్ష్యాతిశయము
మునిసీభుఁ బెదకాఁపు మొదలౌజఘన్యజుల్
తననుండి విడిపోదురనుభయంబు
ఆజన్మసిద్ధమై యలరారుచుండెడి
యక్రమారంభ నిజాభిరుచియు
నిన్నియుం జేయనిది చాలహీనమనుచు
మదికిఁదోఁపక సాక్షియై మాకరణము
కోర్టునకు నెక్కి ముద్దయిల్ కోరినట్లు
పలికెఁ * బినతండ్రితోఁగూడి ప్రల్లదములు॥ 165

ముద్దయిలతరఫు 2వ సాక్షి జానపాటి జానకిరామయ్య కైఫీయ్యతు.
1టో ముద్దాయి ప్రతిష్టచేసినది నాకు యిష్టము. 1-3-4-5 ప్రాసిక్యూషన్ సా

*. ఉ॥ మూడవసాక్షి వర్తకుఁడు,మున్నిభు గ్రామణి పెద్దకాఁపునుఞ్
గూడి"వచింపుసాక్ష్య"మని గ్రుడ్లుఱుముంగనె భీతినంది యీ
పాడునుడుల్ వచించుటకుఁ బొల్పడె, తాను బ్రతిష్ఠయగా నెడ
న్బోఁడట,యిష్టమేయఁట,కనుండు తదుక్తుల నేమియర్థమో॥ 166
ఉ॥ గడ్డియుఁగంపయుండిని విగర్హ్యపు వృత్తి గడించియర్థముఞ్
వడ్డికినిచ్చిబీదల దివాలనిపించునుగాని యూరిలో
హేడ్డులబాకిమాత్రమురకేవిడుచుందుద, పెక్కులేల, పైఁ
బెడ్డలువేయువారలకె పెట్టెడునీతఁడువంకదండముల్॥ 167
తే॥ అంతియే కానియరయంగనుంత యేని

---

తులుకూడా 1టో ముద్దాయితో ప్రితిష్టలు చేయించను వొప్పుకున్నారు. ప్రతిష్టకాలమందు నేను వుండినాను......నారెండవకుమారుడు నాగ్రామంలో చదువులబడివుంచినాడు. 6వ ముద్దాయి తాలూకు కొమారులు బడికిచదవనువస్తారు......1డి ఫెర్స్ సాక్షి రంగయ్యా నాఅన్నకొమారుడు, శీతారామయ్యా, నరసింహాయ్యా నాకు అన్నకొమారులు. కుమ్మరవానికి బియ్యముయిచ్చి బోనము యివ్వమని చెప్పినారు.

* 3వ సాక్షి యేలూరు సర్వయ్యా వైశ్యయ్యాతు.

...కోమటి......నాగ్రామంలో పోలేరమ్మ పాతపాలెమ్మ దేవతలువున్నవి సదరీ దేవతలు యిప్పటికి రెండునెలలక్రిందట పునహా ప్రితిష్టచేయించబడినవి. 1టో ముద్దాయి ప్రితిష్టలు చేసినాడు. ప్రతిష్టలకుగాను గ్రామంలో యావత్తుమంది చందా వేసుకొన్నమాట నిజము. ప్రతిష్టలు చెయ్యాను నాగ్రామంలోవుండేవాండ్లు యావత్తుమంది వొప్పుకున్నాము......1-5 సాక్షులు 1టో ముద్దాయి ప్రతిష్ట చెయ్యాను వొప్పుకొన్నారు. 1టో ముద్దాయి ప్రతిష్టచేసినపుడు నేను పోలేదు......నాకొమారునిమీదవచ్చిన తప్పుసృష్టికేసులో 6వ ముద్దాయి 5వ ముద్దాయితండ్రి 8వ ముద్దాయి తండ్రి ......సాక్షులుగావచ్చినారు. 6వ ముద్దాయిమీద వచ్చినకేసులో నేను సాక్షిగావచ్చియుంటిని. 6వ ముద్దాయి నాకు బాకీవుండేమాటనిజము......నేనుబోనము చెల్లించలేదు. యితరులు యెవరెవరు బోనము చెల్లించినది నాకు తెలియదు. నాగ్రామంలో పెద్దకాపు 6వముద్దాయి...... 1టోముద్దాయివల్ల ప్రతిష్టచేశినందుకు నాఆక్షేపణ యేమిలేదు.........

పిన్న పెద్దవివేకంబు సున్న యచట
అతఁడు కాఁపులఁ గరణాలనందఱవిడి
నిజము వల్కుట కేరీతి నిల్వఁగలఁడు॥ 168
తే॥ వారి కాతఁడు సతనికిఁ వార లెపుడు
సాక్ష్యముల కేగుచుండెడి సరణిఁ జూచి
యతని సాక్ష్య పుయాథార్థ్యమరయు భార
మీర లేవహియింపుఁడో యిద్ధమతులు! 469
సీ॥ పని పూర్తి మాటాడి పఱతెంచుటే తప్ప
సంతతాశ్రయణంబు సల్పఁబోను
తీరియున్న ను నాదు ద్వారసీమ నె తప్ప
నురక వీధులఁ గూరుచుండఁబోను
ఉంశినయాథార్థ్య ముచ్చరించుటె తప్పఁ
బరుప్రీతికనృతంబుఁ బల్కఁబోను
రసికుఁడై వినఁగోరి రావచించుటె తప్పఁ
జేరి మూర్ఖుల కెవో చెప్పఁబోను
జుట్లజుట్లకుముడి వెట్టిచూడఁబోను
వెతకి మెవిమో(యభాండముల్) వేయఁబోను
అరయనిఁక నెట్టు లేలూరినరసయాహ్వా
యుఁడుమదిష్టప్రకారంబు నుడువఁగలఁడు 170
ఉ॥ కారణమేదొ యుండవలెఁగాన్పనఁ ద్రావా సెను "పేరిసాక్ష్యమీ
ధోరణి నున్న"దంచుఁగడు దూఁకుఁడు మైన ధికారి, నేరమే
తీరునఁబోవ నౌను యదె తీరునఁబో వెనునిశ్చయాన, కే
ఘోరము చేయఁగాఁబడదు? కుత్సితమైన ధనాశ యున్న చోఁ 171
ఆ॥ "మాఁకు లెక్కఁ జూచి మైలేజిలిం"దంచు
నస్మదీయ సాక్షులందఱపుడు
పోయియడిగిరతనిఁ బోలీసు కేసాట

సదరఁగొట్టిపంపె నతఁడువారి 172

ఉ॥ పూర్ణయగారిసన్నిధికిఁబోయి వకాల్తునొసంగిరంత, సం
పూర్ణకృపామతిం గదలిపోయి కలెక్టరుతోవచించె,నా
కర్ణనచేసియాఘనుఁడు గ్రక్కునవ్రాసెను గ్రిందికోర్టు;కా
దుర్ణయుఁ డిన్నిమైనతుద దూఁకుడణంగి యిడెన్ వ్యయంబులన్

తే॥ కోర్టులో ధర్మశాస్త్రముల్ కొన్నినావి
దాఖలైయుండ నిప్పింపఁదలఁపఁడయ్యొ
తిరిగితిరిగియు వేసారితిం దదర్థ
మింతకన్నను దౌర్భాగ్య మేమికలదు 174

చ॥ జరిపియెటోయతండు గురిజాలవసించెడికాలమెల్ల శ్రీ
హరికరుణావిశేషమున నావలనేగుటసంభవించి స
త్పురుషుఁడొకండు రాఁ జనినతోడనెయిచ్చెను ధర్మశాస్త్రముల్
సరసుఁడతండు వైశ్యకులచంద్రుఁడు వెంకటరామసెట్టిసూ 175

ఉ॥ ఆవిధిఁగేసుకొట్టుపడి యామహనీయుని బారినుండినే
నేవిధిగానొతప్పుకొని యింటికిఁజేరుడు నూరిలోని మా
యావిదులాచరించుపరిహాచకమెక్కువయైమదావనం
బీవలవెళ్ళఁబెట్టుటకు బ్రీంజసియించె నిఁకేమిచేయుదున్ 176

ఉ॥ "మాయది బ్రాహ్మణత్వమన, మాది ప్రతిష్ఠయొనర్చు కార్యముల్
మాయది సృష్టికార్యము,సమస్తముమాయది,,యన్ ప్రసంగముల్
చేయనుపక్రమించి పనిచేయుటమానిరి బ్రాహ్మణాళి, ,,క
య్యో,, యని వార * లర్జియిడిరొక్కటిపైయధికారిసన్నిధిన్ 177

---

* మహారాజరాజశ్రీ పల్నాడుతాలూకా తహశ్శీలుదార్లువారి సముఖమునకు. తాలూకాయిలాకా జానపాటికాపురస్తుడు జానపాటి రామయ్యవ్రాసుకున్న మనవి. అయ్యా

1 గ్రామంలో వ్యవసాయకులందరికి చక్కగా పనులుజరుగగలందులకు వడ్లకమ్మర్లకు చాకిరియినాములు యేర్పడి యు96-31ట్లువున్నది. భుక్తపరుచుకుంటూ యింకా మామూలు మేరలుపుచ్చుకుంటూ వడ్రంగం కంమ్మరం పనులుచేయుచున్నారు.

వ॥ అనివర్ణించి యాచించ లేకుణ రాజహార్యత్తు దక్షిణోరుభా
గంబునంగూర్చుండిన సమాధినిష్ఠ చాలించి యక్కన్యకాలలామంబునిరీ
క్షించి యత్యంతాద్భుతరసాక్రాంతస్వాంతుండును విస్ఫురితామోదమే
దురవికసిత హృదయ కమలుండును నై తనలో నిట్లనియె. 30

క॥ "రతియో యీగుణవతిభా। రతియో యీమంజువాణిరహిఁగన్పడుపా
ర్వతియో యీశ్యామరమా। సతియో యీకమలపాణిచర్చింపంగన్

తే॥ మెఱుగుపొంగారు బంగారుమించు రేకు
కరువుమురువుగఁగట్టి శృంగారరసము
రాశిగూరిచి మన్మథోగ్రప్రతాప
శిఖిని బుటమిడి విధి దీనిఁ జేయఁబోలు 32

తే॥ కలికిగాదిది చిలుకలకొలికిగాని
కొలికిగాదిది మరుని పూములికిగాని
ములికిగాదిది రతిచేతి చిలుకగాని
చిలుకగాదిది మరువంపుమొలకగాని 33

తే॥ బళిర యీకొమ్మ నెమ్మేనిపరిమళంబు
చందనామోదమో ఘనసారగంధ
సారమో మృగనాభికాసౌరభంబో
కమ్మతావులు గమ్మన గుమ్మరిల్లె 34

సీ॥ మేలైన హరినీలజాలముల్ గాఁబోలు
సొంపొందుదీని సిద్దంపుఁగురులు
అందముల్ గల కురువిందముల్ కాఁబోలుఁ
దళుకుచూపెడి దీనిదంతములును
తగ డాలుగల జాతిపగడాలు కాఁబోలుఁ
గాలతంబులగు దీనికరపదములు
వగఁగ్రాలుచుండుమేల్ మగఱాలుగాఁబోలు
మిసమిసల్ గల దీనిమృదునఖములు

ఉత్తమంపు సొంపాణిక్రొమ్ముత్తియముల
తెగయగాఁబోలు దీనిలేనగవు, పల్కు-
లేలపెక్కులు, నిజము, రత్నాలరాశి
సందియములేద యీశరచ్చంద్రవదన! 35

క॥ అద్దిరదీనిచొకాటపు। ముద్దులచెక్కిళ్లు ముకురములె, నిజమనఁగా
వద్దా, కాకుండినధరఁ। గద్దా ప్రతిబింబమిటులఁ గానంబడుటల్ 36

తే॥ అవురయీకాంత గమనమధ్యాస్యచికుర
వచనకుచములవర్ణింప వశమెనాకు
సారసాశనహరిసోమ నారదశుక
పర్వత శ్రేణులనెంతయుఁ బరిభవిల్ల" 37

మ॥ అని భూపాలవతంసుఁ డిట్లు మదిలో నత్యంతహర్షంబునన్
వనజాతాయతపత్రనేత్ర మిగులన్ వర్ణించి నెమ్మోమునన్
దన దృక్పంకరుహద్వయంబునిచి "కాంతా! యస్మదంకస్థలం
బునఁ గూర్చుండినహేతువేమి? విలసత్స్ఫూర్తిం దగంబల్కుమా

చ॥ ఎవరికుమారివీవు? శరదిందునిభానన! యక్షకాంచనాం
గివొ గరుడాంగనామణివొ కింపురుషోత్పలపత్రనేత్రివో
నవసుతవిద్రుమాధరివొ నాగవధూటివొ కాక సిద్ధరా
డ్యువతివొ సాధ్యరాజసతివో చెపుమా మన ముల్లసిల్లెడిన్ 39

శా॥ సారంగేక్షణ!నీ వినీలచికురాస్యంబుల్ మృదూక్తుల్ బళీ
సారంగాబ్జహరిస్తుతంబులు, నడల్ సత్కంఠరోమావళుల్
సారంగాబ్జహరిస్తుతంబులు, దృగంచత్పాదమధ్యంబులున్
సారంగాబ్జహరిస్తుతంబు లహహా చర్చించివర్ణింపఁగన్ 40

ఉ॥ మోవి మహాజపాకృతిని ముఖ్యతగాంచెఁ, బయోధరంబులు
న్గేవలకుంభకాంతధృతి నిల్పె, నఖంబులుతారకాప్తి నా
రా వహిఁ కెక్కె, నెమ్మొగము రాజవిభూతినెసంగె, మేలుమే
లోవనజాక్షి! నిన్గనిన యోగకళావిదు లిచ్చమెచ్చరే 41

క॥ సొగసగునీకటితటమును। దగ నొప్పెడి లేతగాను తళుకగు మొగముం
నగరాజో మృగరాజో। తొగరాజో తెలియరాదు తోయజనేత్రీ!

తే॥ అతివ! నీదుచనుంగవ యలమహీంద్ర
యుగళమా కాదు వరతారహారగగన
సింధుబంధురధవళకబంధరూప
ఘనఝురీగతమేరు శృంగయుగిగాని" 43

తే॥ అనుచు నారాజదేవేంద్రుఁ డభినుతింప
రంగుబంగరుచేలచెఱం గురోజ
కుంభములమీఁదఁ జక్కఁగాఁగూర్చుకొని త
గంగఁ బలికె జగన్మోహనాంగ గంగ 44

గంగపుట్టిన వృత్తాంతముదెల్పుట.

సీ॥ పాలమున్నీటిలోఁ బవ్వళించెడిభోగి
చరణాంబుజంబు నాజన్మభూమి
మంచుగుబ్బలికూఁతు మించివరించిన
దేవునిశిరము నాదివ్యగృహము
భవనాశినీ తుంగభద్రాసరస్వతీ
నదులు చేరిభజించు నాదుచెలులు
కిన్నరనరసుర పన్నగయక్షాది
జనులు నాసేవకసముదయములు
క్రతుభుగండజమనుజ లోకత్రయంబు
రమణమీఱిన నావిహారస్థలంబు
గంగయననొప్పుదును రత్నగర్భయందు
రాజవంశాబ్జ వనహేళి! రాజమౌళి 45

మ॥ ధరణీపాలక! నీవిలాసమును సౌందర్యంబు చాతుర్యముం
వరభాస్వద్విభవంబు సంపదయు భావప్రౌఢి గంధర్వకి

స్నరయుతోమరసూనులందుఁ గనుగొన్నఁగాలేక మోహంబునన్
దరుణీరూపముదాల్చివచ్చితిని దాత్పర్యంబునంబ్రోవుమీ 46

క॥ కేళీవనపాళీ పాంథాళీకకరాంబుజాకరాంచన్నాళీ
కాళీ సుమధూళీ మత్తాళిధ్వానము విరాళి నలమట వెట్టెన్ 47

శా॥ జ్వాలాభీలవిశాలహాలహలభాస్వద్వీతిహోత్రోజ్జ్వల
త్కీలాసంఘనిమేళనంబు, మలయాద్రిప్రాంగణోద్యన్మహో
త్తాలాకీర్ణపటీరకోటరతలోద్వాంతాహిదంష్ట్రానట
చ్ఛీలం బీమలయానిలంబు నను దాక్షిణ్యంబునంజూచునే 48

క॥ పలుగాకులతో సంగతిఁ బలుగాకులనంగఁ బతుపాతములొదవన్
బలుగములుగూడికోయిలఁబలుగములువి యోగవహ్ని పాలుఁగ జేసెన్

ఉ॥ ఎక్కడదాతునీవలపు నిందుకులాంబుధిపూర్ణచంద్ర! యా
చక్కెరవిల్తు శ్రీచరణసారస యుగ్మముతోడు, నామనం
బక్కట తెల్పరానివిరహాంబుధిలోన మునింగె నయ్యయో
చక్కెరమోవిగ్రోలి నను సౌఖ్యరసంబున నోలలార్పుమీ" 50

మ॥ అని కాంతాతిలకంబుపల్కవిని యాహా యిట్టిచిత్రంబు నే
వినియుం జూచి యెఱుంగ మున్నెచటఁ, బృథ్వీమండలిన్ లోకపా
వని భాగీరథి, మర్త్యకన్యయయి విశ్వవ్యాపునిం జిన్మయున్
మనమందూహయొనర్ప నూఁగువునఁ బ్రేమన్ మన్మథోద్రేకసం
జనిత ప్రాకటవేదనాభరపరిశ్రాంతిం గతభ్రాంతయై 51

వ॥ నిలిచెనని మృదుమధురసరసవచన రచనల సబహుమానం
బుగా నవ్వరారోహకిట్లనియె 52

క॥ "అతివా! లోకులపాటిగ। జితేంద్రియుఁడనై ప్రసిద్ధశీలతఁదగి సూ
నృతలీల నేకపత్నీ। వ్రతమూనిననన్ను నంటవచ్చుటతగునే" 53

తే॥ అనియిటులరాజుపలికిన నంబుజాక్షి
పలికెఁ బలుకులఁ దేనియల్ చిలుకుచుండఁ

దావిచకోర మోవి చెంగావిలోవి
ముత్తియపుముంగరనుగూడి ముద్దుగులుక 54

ఉ॥ "ఓతరుణీమనోహర! యాహా విను తొల్లిఁ బురూరవుండనా
భూతలనాథచంద్రుఁడొగిఁ బొల్పుగ నూర్వశివచ్చి వేఁడినన్
బ్రీతిరమించెఁగాదె, కలశీ యిలలోఁ దమిఁగోరివచ్చు మే
ల్చేఁత మిటారిగుబ్బెతల లీల వరింపనివార లెచ్చటన్" 55

వ॥ అనినసక్కాంతకు భూకాంతుండిట్లనియె. స్త్రీభాగంబగువామోరుప్రదేశంబునఁగాక పుత్రార్హంబయిన దక్షిణాంకస్థితవగుటం జేసి మదీయకుమారుండగు శంతను పాణిగ్రహణంబు సేయుము. మృగయావినోదార్థంబుగా నితాంతవిశ్రాంతానంత పుష్పంధయ స్తనంధయామందబంధురరవాత్యంతనిరంతరీకృత దిగంతరాళంబైన వసంతకాలంబున సల్లలితసహకారపల్లవతల్లజ ఖాదనాకుంఠితకలకంఠకంఠగళత్పంచమకుహూకారంబైన యిచ్చటికాంతారంబునకు నాత్రిభువనమాకందారామవసంతుఁడైన కుమారకంఠీరవుం డవశ్యంబే తెంచు. తత్సమయంబున నీయభిమతార్థంబు సిద్ధించు, అతండు పుండ్రేక్షుకోదండ భాస్వత్సౌందర్యవంతుండును శ్రీమంతుండును, సౌరధునీహీరమణి నారదనీహారఘృణిక్షీరఫణీడ్గౌరమణీపారదబిత్త్యయశఃకర్పూరఖండపిచండిల బ్రహ్మాండకరండ మధ్యభాగుండును, మహాభాగుండును, కామధుక్కృతభుగ్రతోష్ణదముక్సుధారుక్సహస్రదృక్సర్వం సహాజాత రోహణమహీధరపయస్సముద్రసిద్ధిద్రభద్రదానూనదానధారాసారపరివర్షితనిఖిలయాచకసారంగమండలుండును మహాభోగతిరస్కృతాఖండలుండును, అహార్యవర్యస్థైర్యధైర్యుండును దర్పాంధపరిపంధికంధి మంధవసుంధరాధరాయమానానివార్యదోశ్శౌర్యుండును, అతఁడే నుపవరింపం దగదుకాని మదీయ గుణవిశేషంబులకన్న నెక్కుడగు గుణవంతుం"డని చెప్పి యొడంబఱచిన. నక్కన్యకాలలామంబు సంతసించి తత్కాలనిరీక్షణంబు సేయుచు హిమవన్నగప్రాంతోద్యానంబునఁ జెలికత్తియలు దాను విహరింపుచుండె

అంత సమాధినిష్ఠచాలించి ప్రదీపకుమారకాంతుండు నిజపురంబున కేతెంచి యత్యంతవైభవోపేతుండై సుఖంబుండి యేకాంతంబునఁ బుత్రునకిట్లనియె. 56

పంచచామరము.

మరాళయాన నంబుజాంఘ్రి మంథసానుభృత్పయో
ధరం బ్రవాళహస్త నంబుదప్రకాశకైశిక
కురంగశాబకాక్షిఁ బుష్పకోమలాంగి నోర్తు నే
సురాపగాతటంబునందు సొంపుమీఱఁగాంచితిన్ 57

సీ॥ కలికియానను జన్నులు కౌను కన్నులు
సారంగధరహరి శ్రీరహించె
నలినాక్షనూగారు నఖరముల్ జడ నాభి
పున్నాగసద్ఘనస్ఫురణనెసఁగె
పణఁతివీనులు మేను పల్కులు చెక్కులు
నవచంద్రఖండ సుందరతగాంచె
వనితకంఠము కటి వాతెఱ నెమ్మొగ
మబ్జారిబింబలీలాప్తిఁదనరె
కరి గిరులు సింగ మేణంబు హరి భములు జ
లదము తుంగంబు తొమ్ముదు లైవ్వఁడి చక్క
రలు కపురము దరంబు చక్రంబుదొండ
పండు శశిఁగూర్చి విధి సృజింపంగఁబోలు 58

చ॥ చిలుకల కల్కిపల్కుల నిసీయనుఁ బల్కులతీపు, కంతుపూ
ములుకులవంకదీర్చు నవమోహనమూనిడువాలుచూపు, మేల్
కొలఁకుల నక్కఁజేయు నల కోమలవృత్తగభీరనాభి, హా
చిలుకలకొల్కిశోడ సరిచెప్పఁగ ముజ్జగమందుఁ గల్గునే 59

తే॥ రమణినుచుపల్కు తీరు కీరమణి గేరు
లలన లేనవ్వుఁజిగి వెన్నెలలను నవ్వు

ద్భుతునిఁ స్వామిహితైకతత్పరు నమాత్యుంగాఁగొనండేని భూ
పతి తద్రాజ్యము నూతికట్టపసిపాపండాటగాదే సుతా!॥ 67
చ॥ పతిహితకార్యభార మనపాయతనూననివాఁడు మంత్రియే
మతిఁబరికింపఁ దత్కృతకమంత్రమునమ్మినవాఁడు మేదినీ
పతియె,యతండుసంతతముపాలనఁజేసెడి దెన్న రాజ్యమే
వ్రతముగనచ్చటంగలుగువారిది సంపదయే కుమారకా!॥
క॥ ధనమాన నేలినాతని। పనిభంగముఁ జేసి పొసఁగఁబఱితెంచిన దు
ర్జను నిమిషమైననుంచక। తనరాష్ట్రము వెడలనడుపఁడగు నరపతికిన్॥
క॥ తగురీతిని బ్రజఁ జేకొనఁ
దగు సరికలకలిమినెల్లఁ దగునేకొనఁ బా
లొగి నేర్పుమెయినిబిడుకక
యగునెఱుదవుపొదుగుకోసి యమరంగొనఁగన్॥
తే॥ సకలవర్ణజనంబులు శ్రోత్రదివిజుల
గురుమతినిభక్తిసేయుట వరుల దార
లనుసరించుట నృపదండముననె కాక
వేదవేత్తల సద్ధర్మవిసులనవును॥ 71
తే॥ పాపవర్తనమన్నించి పనులుగొనుట
తనయుఁడైన మిగుల విగతనయుడఁగుచుఁ
దప్పొనర్చినచోఁ దగ దండనంబు
మానియుండుట నృపతికిహానిఁ జేయు॥ 72
క॥ పరదేశపతులు పంపిన
గురుమధురఫలాదులొరులఁగుడువఁబనిచి సు
స్థిరగతివారల కరుగుట
యెఱిఁగి మఱిభుజింపనగు మహీశునకెందున్॥ 73
తే॥ రఘుయయాతిభగీరథ రామభద్ర
జనకభరతాదులగు పురాతనమహీశ

చెలువచనుకట్టు గట్టుల చెలువుం దిట్టు
నెలంత మోమును దగు నెల తలనుబూన 60

క॥ ఇన్నేల చెప్పం బుత్రక! కన్నియ నెఱికొప్పు కప్పుకన్నన్ హెచ్చై
చెన్నారు నారుతీ రాపన్నగపతిచాలం డౌర ప్రణతుల్ సేయన్ 61

వ॥ ఇట్లు జగన్మోహనాకారంబుతోడ నమ్ముద్దియ గ్రద్దన నొద్దికతోడ నేతెంచి మదీయదక్షిణోరుభాగంబున సుమశరనిశితనిష్ఠురవిశిఖవిసరజర్ఝరితశరీరయై కూర్చుండి హెచ్చుగాం బిచ్చలించు మోహంబచ్చుపడం "గన్ననం దన్ను మన్ననం గనుంగొని వరింపు"మన నేను "నేకపత్నీవ్రతస్థుండ నదియునుంగాక మదీయపుత్రార్థంబైన దక్షిణాంకసంస్థితవగుటం జేసి నీవాకుమారతిలకు పాణిగ్రహణంబు సేయుము మృగయావినోదార్థంబుగా వసంతకాలంబున నీతుషారాచలపరిసరోద్యానంబునకుం జనుదెంచు"నని చెప్పిపుచ్చితి,నీ వవ్వసంతాగమంబునం జనియవ్వరారోహన్ వివాహంబుగ"మ్మని చెప్పి రాజ్యాభిషిక్తుం జేసి మఱియునిట్లనియె 62

—ప్రదీపుండు శంతనునకు రాజనీతులు చెప్పుట—

క॥ సప్తవ్యసనవివర్జితు।సప్తాంగధురీణుం గలితశక్తిత్రయునిన్
సప్తాశ్వసత్ప్రతాపుని।సప్తద్వీపప్రభుత్వసంపద చెందున్॥ 63

క॥ వలయునిలు ధాన్యఘృతతైలలవణపిష్టాదిపుష్కలంబయి జాగ్ర
ద్బలయుతములైన భువనస్థలగిరిదుర్గములవలె రసాతలపతికిన్॥ 64

క॥ జలకేళిని వనకేళిని।లలనలతో నిష్టలీలలన్ మొలంగెడి వే
ళలం బానసుప్తిసమయం।బులరక్షణవలయుం జుమ్మిభూమీశునకున్॥

క॥ బలవంతునితో సామం।బలవడంగా వించుటయు జయాలోలమతిన్
బలహీనునిదండించుట।బలహరునకునయిన నీతిపథముకుమారా॥66

ఉ॥ చతురోపాయచతుష్టయాశ్రయుమహోత్సాహున్ రహస్యక్రియా
హితమర్మజ్ఞుని మంత్రరక్షణకళాహేలున్ సుశీలున్ నయా

ఈనెల సొమ్ము చెల్లించిన చందాదారులు.

1 దమ్మడపు వెంకటరత్నయ్యగారు, ముదికెపూడి
2 వావిలాల సుబ్బయ్యగారు, భృగుబండ
3 పిల్లలమఱ్ఱి సోమయాజులుగారు, ఇంగ్లీషు హెడ్క్లార్కు, కలెక్టరు ఆఫీసు, గుంటూరు
4 శాతంరాజు సూర్యనారాయణగారు, తుమురుగోడు
5 అక్కిరాజు శంకరనారాయణగారు, గుత్తికొండ
6 చింతలపాటి రామమూర్తి శాస్త్రిగారు, చవటపల్లి
7 జోస్యుల రామబ్రహ్మముగారు, ఫారెస్టు రేంజిక్లర్కు, మాచర్ల
8 నడింపల్లి లక్ష్మీనారాయణగారు, ఫారెస్టు రేంజిక్లర్కు, బాపట్ల
9 చేబియ్యము వెంకటరామయ్యగారు, రివిన్యూ యినస్పెక్టరు, పులివెందల
10 ముండ్లపాటి రామనాథరావుగారు, ముండ్లపాడు
11 పెద్దిభట్ల లక్ష్మీనరసింహముగారు, ప్లీడరు, తెనాలి
12 వ్యాకరణము రామకృష్ణయ్యగారు, మానికెలగుమాస్తా, గురిజాల
13 బ్రహ్మభట్ల పట్టాభిరామయ్యగారు, గుడివాడ
14 మకరాల సీతారామశాస్త్రిగారు, తమిరిశ
15 అమరవాది రామకవిగారు, బాలెసుర్తి
16 ఇయ్యూణ్ని అనంతపద్మనాభ దేశికాచార్యులుగారు, వెంకటరామునిమోరి. వాణిపేట
17 సూరి పూర్ణానందముగారు, పోలీసు సబినస్పెక్టరు, క్రోసూరు
18 దేవులపల్లి వెంకటరామశర్మగారు, ఆగిరిపల్లె

## ప్రధానపోషకులు.

1 శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్షస్వాములవారు.

2 శ్రీ రాజా కోటగిరి వెంకటకృష్ణారావు బహద్దరు
జమీందారుగారు గంపలగూడెం

## పోషకులు.

1 శ్రీ రాజా నారయప్పారావు సింహాద్ర్యప్పారావు బహద్దరు
జమీందారులు, నూజవీడు.

2 అల్లాడి లక్ష్మణరావుగారు కరణము జంగపల్లి

3 రామసింగుగారు నెల్లుట్ల పాపురావు సంస్థానము మానేజరు నెల్లుట్ల

4 రంగావఝ్ఝుల హనుమయ్యగారు జిల్లాకోర్టువకీలు గుంటూరు

5 తాడేపల్లి లక్ష్మీనరసింహారావుగారు ముక్తాదారు వోల్లేరు

6 బీరకాయలరామారావు దేశముఖుగారు రాయగిరి

## సహాయకులు.

1 అన్నమురాజు సుబ్బారావుగారు నందూరు

2 నందూరు నరసింహారావుగారు, కరణం, నందూరు.

3 నైషధము సీతాకాంతముగారు మోరంపూడి

4 మెదకు శేషారావు దేశముఖుగారు, నల్లబల్లి.

5 పరాంకుశరావు దేశముఖుగారు యాడారం

6 కుప్ప శంకరశాస్త్రిగారు, చిన్నలూరు.

7 గంభీరరావు దేశాయిగారు, లింగన్నపేట.

8 నారసింహారెడ్డి దేశాయిగారు, కాసరబాద.

9 కొండపల్లి అనంతరామయ్యగారు; వకీలు. జానగాం.

10 పిరాట్ల సీతాకాంతముగారు, చింతపల్లి.

11 కాకుమాను హనుమయ్యగారు, నర్సారావుపేట.

12 తంగెడ నరసింహారావుగారు, కరణం, మోర్జంపాడు.

13 చెన్నూరు రామంగారావు దేశపాండ్యాగారు, పెదవీడు.

14 వాసిరెడ్డి వెఱ్ఱెయ్యగారు చేబ్రోలు.

15 వెలుగూరి పిచ్చయ్యగారు, కోదమగుండ్ల.

16 తుమురుగోటి నరసింహారావుగారు, తిరుమలగిరి.

17 గొల్లపూడి వేంకటసుబ్బారావుగారు, వాల్టార్ బ్రదర్సు, ఏజంటు

18 దొనుకూరి బ్రహ్మందీక్షితులుగారు గుంటూరు.